ISBN 81-7120-021-4

## మా తెలుగు ప్రచురణలు

శ్రీ రామకృష్ణ జీవిత చరిత్ర

శ్రీ రామకృష్ణ బోధామృతము

శ్రీ రామకృష్ణ పరమహంస నీతి కథా రత్నములు

నా గురుదేవుడు

శ్రీ రామకృష్ణ దివ్యవాణి

శ్రీ శారదాదేవి చరిత్ర

శ్రీ శారదా ప్రసంగములు

శ్రీ వివేకానంద జీవిత చరిత్ర

భక్తి యోగము

రాజ యోగము

కర్మ యోగము

వివేక సూర్యోదయము

భారత యువజనులారా!

హిందూమతము

కులము, సంస్కృతి, సామ్యవాదము

భారత దేశము

తాపత్రయ చికిత్స

నారద భక్తి సూత్రములు

Sri Vishnu Sahasranama Stotramu (Telugu) Rs. 6. 00

# శ్రీవిష్ణు సహస్రనామ స్తోత్రము



# శ్రీ విష్ణు సహస్రనామ స్తోత్రము





**రామకృష్ణ మఠం**

దోమలగూడ, హైదరాబాదు - 500 029

# తొలి పలుకులు

'శాంతనందనా! లోకాలకు ఏకైక శరణ్యుడైన మహనీయ దైవతమెవ్వరు? ఎవ్వరి నర్చించినందువల్ల జనులకనవరత మంగళ సంపత్తి చేకూరుతున్నది? కోధర్మః సర్వధర్మాణాం భవతః పరమో మతః? సర్వధర్మాలలోకి ఉత్తమోత్తమమైనది ఏది? జపాలన్నింటిలోకి సంసారబంధం నుంచి నరుని తప్పించగల శక్తిమంతమైన జపమేది?' అని యుధిష్ఠిరుడు అడిగినప్పుడు సంతసించి, పరమాదరపూర్వక దృక్కులతో గంగానందనుడు ప్రసంగిస్తాడు. 'ధర్మనందనా! పురుషోత్తమ దేవుడు సమస్త లోకాలకు ఏకైక దైవతము. ఆ మహనీయుడు అనంతుడు, పరమ మంగళ స్వరూపుడు. ప్రగాఢ భక్తి శ్రద్ధలతో ఆ దేవాధిదేవుడిని ఎల్లప్పుడు సహస్రనామాలతో స్తుతించిన ఘోరపాపాలు నశించి సర్వదుఃఖాలు తొలగిపోగలవు, అంటూ 'ఏష మే సర్వధర్మాణాం ధర్మోధికతమో మతః యద్భక్త్యా

దృక్కులతో గంగానందనుడు ప్రసంగిస్తాడు. 'ధర్మనందనా! పురుషోత్తమ దేవుడు సమస్త లోకాలకు ఏకైక దైవతము. ఆ మహనీయుడు అనంతుడు, పరమ మంగళ స్వరూపుడు. ప్రగాఢ భక్తి శ్రద్ధలతో ఆ దేవాధిదేవుడిని ఎల్లప్పుడు సహస్రనామాలతో స్తుతించిన ఘోరపాపాలు నశించి సర్వదుఃఖాలు తొలగిపోగలవు, అంటూ 'ఏష మే సర్వధర్మాణాం ధర్మోధికతమో మతః యద్భక్త్యా

పుండరీకాక్షం స్తువైరర్చేన్నరః సదా'--అన్ని ధర్మాలలోకి ఉత్కృష్టమైన ధర్మమంటే భక్తితో, స్తోత్రాలతో పుండరీకాక్షుని అర్చించటం, అంటాడు. శక్తిమంతమైన ఆ నారాయణుడి సహస్రనామాలను ప్రతిదినం జపించటమే పరం జపం అవుతుందనీ అ పరంధాముడే పరమతపస్సు, మహద్బ్రహ్మ, పరమ పవిత్రుడు అని తెలియజేస్తాడు. విష్ణుసహస్రనామాలకి ఇంతకంటే మించి పరిచయ వాక్యాలు అవసరం లేదు. స్తోత్రారంభంలోనే భీష్మపితామహుడు ఈ సహస్రనామాల మాహాత్మ్యాన్ని వివరిస్తాడు. గుణాతీతుడు, గుణస్వరూపుడు ఐన ఆ ఆదిదేవుని సగుణ సాకార రూపంలోనూ, నిర్గుణ నిరాకారం గానూ స్తుతించే నామాలు ఈ

సహస్రనామాలలో మనకు కనిపిస్తాయి. లోకాధ్యక్షః, ధర్మాధ్యక్షః, సర్వదృక్ మొదలైన నిర్గుణ బ్రహ్మానికి సంబంధించిన నామాలనూ మరియూ వామనః, పద్మనాభః, అరవిందాక్షః లాంటి సగుణ సాకార రూపాన్ని ఆవిష్కరించే నామాలనూ విష్ణుసహస్రనామాలలో మనం చూస్తాం. ఆ విధంగా భక్తుడికి సహస్రనామ జపం సంపూర్ణమైన సాధన అవుతుంది. పూర్ణఫలాన్ని అందించగల స్తుతి ఇది.

నారాయణుని సంపూర్ణుడిగా పూర్ణపరబ్రహ్మగా ఉపాసించటానికి ఈ స్తోత్రం ఉద్దేశింపబడినప్పటికీ హైందవులకు విష్ణువు అనగానే వెంటనే వైకుంఠం గుర్తుకు రాక మానదు. వైకుంఠంలో మరి నారాయణుడితో సదా ఆయన సేవలో ఉండే జగన్మాత లక్ష్మీదేవికూడా కొలువై ఉంటుంది. మరి ఆ మాతను స్తుతించకుండా కేవలం భగవానుడిని ప్రస్తుతించలేం కదా. అలా ఆ పరబ్రహ్మను పురాణ పురుషుడిగా భావించి అర్చించే భక్తుల సౌలభ్యంకోసం పుస్తకం చివరలో శ్రీలక్ష్మీఅష్టోత్తర శతనామాల్ని కూడా పొందుపరిచాము. నిర్గుణ నిరాకార ఉపాసకులు విష్ణుదేవుని పురుషుడిగా లక్ష్మీదేవిని ప్రకృతిగా భావించుకొని అష్టోత్తర శతనామాల్ని జపించిన ఇహపర సౌఖ్యాలను పొందుతారు.

మహాభారతంలోని అనుశాసన పర్వంలోగల ఈ స్తుతి ప్రభావం గురించి గాంగేయుడు ధర్మరాజుకు చెప్పిన పలుకులను స్మరించడం సందర్భోచితం. 'ఎవరైతే ప్రతిదినము మిక్కిలి భక్తిశ్రద్ధలతో ఈ స్తోత్రాన్ని పఠిస్తారో వారికి పాపాలన్నీ తొలగిపోయి క్రమక్రమంగా పరబ్రహ్మపదమే కరతలామలకం కాగలదు' అన్న శాంతనవుడి ఈ ఒక్క వాక్యం ద్వారా సహస్రనామ స్తోత్రం ఎంత మహిమాన్విత మైనదో మనం అర్థం చేసుకోవచ్చు. కాబట్టి జన్మసాఫల్యానికి ఈ స్తోత్రం చక్కటి సోపానం అని గ్రహించి సాధకులు, భక్తులు నిత్యం భక్తితో ఈ నామావళిని జపిస్తారు గాక!

శ్రీ తపస్యానంద స్వామి వారి ఆంగ్లగ్రంథానికి అనుసృజన ఐన ఈ గ్రంథం వెనుక ఉన్న కృషి, ప్రస్తుతం దివ్యజీవన సంఘం, హృషికేష్‌లో ఆచార్యగా ఉన్న శ్రీ సుబ్బారావు గారిది. వారికి మా ధన్యవాదాలు.

ఈ గ్రంథాన్ని చక్కగా టైప్ చేసి ఇచ్చిన శ్రీరామకృష్ణ సేవాసమితి, బాపట్ల వారికి, ప్రూఫ్‌లు దిద్దటంలో మరియు శ్రీలక్ష్మీఅష్టోత్తర శతనామాన్ని పొందుపరచటంలో సహకరించిన శ్రీమతి జానకి గారికి మా కృతజ్ఞతలు.

ఇంతకు ముందు కేవలం పూర్వ పీఠిక, ఉత్తర పీఠికకు మాత్రమే తాత్పర్యాన్ని ప్రచురించి పుస్తకాన్ని అందించడం జరిగింది. భక్తులు ఎప్పటినుంచో అడుగుతున్నప్పటికీ నామాలన్నింటికీ తాత్పర్యాన్ని కూర్చి వెంటనే పుస్తకాన్ని ప్రచురించలేకపోయాము. ఇప్పటికి భక్తుల కోరికను నెరవేర్చగలందులకు సంతసిస్తున్నాం. మత మిగతా ప్రచురణలలాగే ఈ పుస్తకం కూడా విశేష భక్తజనాదరణకు నోచుకుంటుందని ఆకాంక్షిస్తున్నాం.

Published by :
The President
Sri Ramakrishna Math
Mylapore, Madras 600 004



Tenth Impression
X - 10m 3c - 2 - 93
ISBN 81 - 7120 - 021 - 4

Printed in India at
Sri Ramakrishna Math Printing Press
Mylapore, Madras 600 004

ఓమ్

# శ్రీవిష్ణుసహస్రనామస్తోత్రము

## పూర్వభాగము

శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం
ప్రసన్నవదనం ధ్యాయేత్ సర్వవిఘ్నోపశాంతయే. 1

వ్యాసం వసిష్ఠ నప్తారం, శక్తేః పౌత్ర మకల్మషం
పరాశరాత్మజం వందే శుకతాతం తపోనిధిమ్. 2

వ్యాసాయ విష్ణురూపాయ, వ్యాసరూపాయ విష్ణవే
నమో వై బ్రహ్మనిధయే, వాసిష్ఠాయ నమోనమః. 3

తెల్లని వస్త్రములను ధరించినట్టియు; విష్ణువవలె జగమెల్లను వ్యాపించినట్టియు, చంద్రునివలె స్వచ్ఛమైన కాంతిని గలిగినట్టియు, నాలుగుచేతులు గలట్టియు, శాంతిగల ముఖమును గలిగినట్టియు, గణపతిని సకల విఘ్నములను నివారించుటకొఱకు ధ్యానించవలయును. 1

వసిష్ఠమహామునికి మునిమనుమడైనట్టియు, శక్తిమహామునికి మనుమడైనట్టియు, పరాశరమునికి పుత్రుడైనట్టియు, శుకమహర్షికి జనకుడైనట్టియు, నిర్మలుడైనట్టియు, తపమను ధనరాశి గలిగిన వ్యాసులవారిని గూర్చి నమస్కారము చేయుచున్నాను. 2

విష్ణురూపుడైన వ్యాసులవారి కొఱకును, వ్యాసరూపముతో నున్న విష్ణువుకొఱకును, వేదములకు గనియైన వాని కొఱకు నమస్కారము. వసిష్ఠుని వంశమందు జన్మించిన వ్యాసునికి నమస్కారము. 3

అవికారాయ శుద్ధాయ నిత్యాయ పరమాత్మనే
సదైకరూప రూపాయ విష్ణవే సర్వజిష్ణవే. 4

యస్య స్మరణమాత్రేణ జన్మ సంసార బంధనాత్
విముచ్యతే నమస్తస్మై విష్ణవే ప్రభవిష్ణవే. 5

ఓం నమో విష్ణవే ప్రభవిష్ణవే.

శ్రీ వైశంపాయన ఉవాచ:—

శ్రుత్వాధర్మ మశేషేణ పావనాని చ సర్వశః
యుధిష్ఠిర శ్శాంతనవం పునరేవాభ్యభాషత. 6

వికారరహితుడును, పరిశుద్ధుడును, శాశ్వతుడును ఆత్మస్వరూపుడును, అన్నిరూపములు తానేయై ప్రకాశించు విష్ణువుకొఱకు (నమస్కారము) 4

ఎవనిని తలంచినంతమాత్రముననే సంసారబంధములు జన్మపరంపరలు వదలిపోవుచున్నవో అట్టి ప్రతిభావంతుడైన విష్ణుదేవునికి నమస్కారము. 5

ఓం సర్వవ్యాపియై ప్రకాశించు విష్ణువునకు నమస్కారము.

సకల ధర్మములును, పాపములను పోగొట్టు విధములను విని ధర్మరాజు భీష్మునితో మరల ఇట్లనియెను. 6



యుధిష్ఠిర ఉవాచ :—

కిమేకం దైవతంలోకే కింవాప్యేకం పరాయణం
స్తువంతః కం కమర్చంతః ప్రాప్నుయుర్మానవాః శుభమ్. 7
కోధర్మః సర్వధర్మాణాం భవతః పరమో మతః
కిం జపన్ముచ్యతే జంతుర్జన్మ సంసార బంధనాత్. 8

శ్రీ భీష్మ ఉవాచ :—

జగత్ ప్రభుం దేవదేవం అనంతం పురుషోత్తమం
స్తువన్నామసహస్రేణ పురుషః సతతోత్థితః. 9
తమేవ చార్చయన్నిత్యం భక్త్యా పురుషమవ్యయం
ధ్యాయన్ స్తువన్నమస్యంశ్చ యజమానస్తమేవ చ. 10

ధర్మరాజు పలికెను :—

ఈ లోకమునందు ప్రధానమైన ఒకే దైవమేది? ముఖ్యమైన శుభస్థానమేది? ఎవనిని పూజించి నుతించి మానవులు శుభములు పడయుదురు? 7

సర్వధర్మములలో నే ధర్మమును గొప్పదిగా మీరు తలచుచున్నారు? దేనిని జపించిన జీవులు జన్మపరంపరలతో కూడిన సంసారబంధమునుండి తప్పించుకో గలరు? 8

భీష్ముడు చెప్పెను :—

లోకేశ్వరుడును, దేవదేవుడును, అనంతుడును, పురుషోత్తముడగు విష్ణుదేవుని, సదా, శ్రద్ధతో వెయ్యి నామములతో స్తుతించిన పురుషుడు, రక్షణము కలవాడగును. 9

నాశనరహితుడైనటువంటియు, పురుషుడైనటువంటియు, విష్ణుదేవునే నిత్యము భక్తితో పూజించి ధ్యానించి కీర్తించి నమస్కరించిన పురుషుడు తరింపగలడు. 10

అనాది నిధనం విష్ణుం సర్వలోక మహేశ్వరం
లోకాధ్యక్షం స్తువన్నిత్యం సర్వదుఃఖాతిగో భవేత్. 11
బ్రహ్మణ్యం సర్వధర్మజ్ఞం లోకానాం కీర్తివర్ధనం
లోకనాథం మహద్భూతం సర్వభూత భవోద్భవమ్. 12
ఏషమే సర్వధర్మాణాం ధర్మోఽధికతమోమతః
యద్భక్త్యా పుండరీకాక్షం స్తవైరర్చేన్నరః సదా. 13
పరమంయో మహాతేజః పరమంయో మహత్తపః
పరమంయో మహద్బ్రహ్మ పరమంయః పరాయణమ్. 14

ఆది అంతములు లేనట్టియు, సకలలోకములకు నాయకుడైనట్టియు, లోకములను శాసించునట్టియు, విష్ణుమూర్తిని ప్రతిరోజు స్తోత్రము చేసిన సర్వదుఃఖములు నశించును. 11

వేదమయుడైనట్టియు, సకలధర్మముల నెరిగినట్టియు, లోకములకు కీర్తిని పెంచునట్టియు, జగన్నాథుడైనట్టియు, అన్నిటికంటె గొప్పవాడైనట్టియు, సర్వజీవుల పుట్టుటకు కారణభూతుడైనట్టియు, విష్ణుదేవుని స్తుతించిన సకల కష్టములు తొలగును. 12

ఎవరైనను కమలములవంటి కన్నులుగల విష్ణుదేవుని సదా భక్తితో స్తోత్రముచేసి పూజించుటచేతనే సకల ధర్మములకు మేలైన ధర్మమని నా యభిప్రాయము. 13

సమస్త తేజములకు తేజస్సుగాను, సకల తపస్సులకు తపస్సుగాను, పరబ్రహ్మముగాను, పునర్జన్మలవలన భయము లేని స్థానముగా నున్న విష్ణువే పరమ గతి యని నా యభిప్రాయము. 14



పవిత్రాణాం పవిత్రంయో మంగలానాంచ మంగలం
దైవతం దేవతానాంచ భూతానాంయో ఽవ్యయః పితా. 15
యతః సర్వాణి భూతాని భవన్త్యాది యుగాగమే
యస్మిం చ ప్రలయంయాంతి పునరేవ యుగక్షయే. 16
తస్యలోక ప్రధానస్య జగన్నాథస్య భూపతే
విష్ణోర్నామ సహస్రం మే శ్రుణు పాప భయాపహమ్. 17
యానినామాని గౌణాని విఖ్యాతాని మహాత్మనః
ఋషిభిః పరిగీతాని తానివక్ష్యామి భూతయే. 18

పవిత్రమైన వారికి పవిత్రుడై, సకల శుభములకు శుభుడై, దేవతలకు దేవుడై, శాశ్వతుడైనట్టి విష్ణువే దేవుడు.

కల్పాది కృతయుగముయొక్క ప్రారంభమందు, సకల భూతము లే దేవునినుండి పుట్టుచున్నవో? ప్రళయము రాగా యుగములు నశించినప్పుడు మరల నే దేవునియందు చేరుచున్నవో? అట్టి విష్ణువే దైవము. 16

ఓ ధర్మరాజా! లోకములకు మూలకారణుడై, జగములకు నాథుడైన విష్ణుదేవునియొక్క సహస్ర నామములు పాపమును, భయమును పోగొట్టును, ఆ నామములను నా ద్వారా వినుము. 17

ఏ నామములు మహాత్ముడైన విష్ణువునకు గుణములై ప్రసిద్ధి గాంచినవో? ఏ నామములు మునులచేత గానము చేయబడినవో? ఆ శ్రీ విష్ణు సహస్రనామములు పురుషార్థములు సిద్ధించుటకై నీకు చెప్పెదను. 18

ఋషిర్నామ్నాం సహస్రస్య వేదవ్యాసో మహామునిః
ఛందోఽనుష్టుప్ తథా దేవో భగవాన్ దేవకీ సుతః. 19

అమృతాం శూద్భవో బీజం శక్తి ర్దేవకి నందనః
త్రిసామా హృదయం తస్య శాంత్యర్థే వినియుజ్యతే. 20

విష్ణుం జిష్ణుం మహావిష్ణుం ప్రభవిష్ణుం మహేశ్వరం
అనేక రూపదైత్యాంతం నమామి పురుషోత్తమమ్. 21

సహస్రనామ మంత్రమునకు వేదవ్యాసుడు ఋషి,
అనుష్టుప్ ఛందస్సు, దేవకీ సుతుడైన భగవంతుడు దేవత. 19

అమృతాంశూద్భవ బీజము, దేవకీ నందనుడు శక్తి
త్రిసామహృదయము, శాంతికొఱకు సహస్రనామ మంత్రము
జపింపబడుచున్నది. 20

జయశీలుడును, విశ్వవ్యాపకుడును, మహేశ్వరుడును
అనేక రూపములు గల దానవులను సంహరించిన వాడును
పురుషోత్తము డగు విష్ణుదేవునకు నమస్కారము చేయు
చున్నాను. 21

---

## పూర్వన్యాసః

అస్య శ్రీ విష్ణోర్దివ్య సహస్రనామస్తోత్ర మహామంత్రస్య శ్రీ వేదవ్యాసో భగవాన్ ఋషిః, అనుష్టుప్ ఛందః, శ్రీ మహావిష్ణుః శ్రీమన్నారాయణో దేవతా, అమృతాంశూద్భవో భానురితిబీజం, దేవకీ నందనః స్రష్టేతి శక్తిః, ఉద్భవః క్షోభణో దేవ, ఇతి పరమో మంత్రః శంఖభృన్నందకీ చక్రీతికీలకం, శార్ఙ్గధన్వా గదాధర ఇత్యస్త్రం, రథాంగ పాణి రక్షోభ్య ఇతినేత్రం, త్రిసామాసామగః సమేతి కవచం, ఆనంద పరబ్రహ్మేతి యోనిః, ఋతుః సుదర్శనః కాల ఇతి దిగ్బంధః. శ్రీ విశ్వరూప ఇతి ధ్యానమ్,॥



శ్రీ మహావిష్ణు ప్రీత్యర్థే సహస్రనామ జపే వినియోగః

---

## కరన్యాసః

విశ్వం విష్ణుర్వషట్కార ఇత్యంగుష్ఠాభ్యాం నమః
అమృతాంశూద్భవోభానురితి తర్జనీభ్యాం నమః
బ్రహ్మణ్యో బ్రహ్మకృత్ బ్రహ్మేతి మధ్యమాభ్యాం నమః
సువర్ణ బిందు రక్షోభ్య ఇతి అనామికాభ్యాం నమః
నిమిషోఽనిమిషః స్రగ్వీతి కనిష్ఠికాభ్యాం నమః
రథాంగపాణి రక్షోభ్య ఇతి కరతలకరపృష్ఠాభ్యాం నమః

---

## అంగన్యాసః

స్వరతస్సుముఖసూక్ష్మం ఇతిజ్ఞానాయ హృదయాయ నమః
సహస్రమూర్తిః విశ్వాత్మా ఇతి ఐశ్వరాసీయ శిరసే స్వాహా
సహస్రార్చిః సప్తజిహ్వా ఇతిశక్త్యై శిఖాయై వషట్
త్రిసామాసామగస్సమేతి బలాయ కవచాయహుం
రథాంగపాణి రక్షోభ్య ఇతి నేత్రాభ్యాం వౌషట్
శార్ఙ్గధన్వాగదాధర ఇతి వీర్యాయ అస్త్రాయఫట్

ఋతుస్సుదర్శనః కాల ఇతి దిగ్బంధః

---

# ధ్యానమ్

క్షీరోదన్వత్ ప్రదేశే శుచిమణి విలసత్ సైకతే మౌక్తికానాం
మాలా క్లుప్తా సనస్థః స్ఫటికమణి నిభైః మౌక్తికైర్మండితాంగః
శుభ్రైరభ్రైరదభ్రై రుపరివిరచితైర్ముక్త పీయూష వర్షైః
ఆనందీ నః పునీయా దరినలిన గదా శంఖపాణి ర్ముకుందః. 1

భూః పాదౌయస్య నాభిర్వియదసురనిలశ్చంద్ర సూర్యౌ చ నేత్రే
కర్ణావాశాః శిరోద్యౌ ర్ముఖమపి దహనో యస్య వాస్తేయ మబ్ధిః

ధ్యానశ్లోకములకు తాత్పర్యము

స్వచ్ఛమైన రత్నములతో కూడిన యిసుక ప్రదేశములు గల పాలసముద్రములో, ముత్యాలదండలతో అలంకరింపబడిన సింహాసనమందు స్ఫటికములబోలు ముత్యములతో అలంకరింపబడిన అవయవములు గలిగి, తెల్లని మేఘముల నుండి జారిన అమృతవర్ష ధారలచే ప్రకాశించునట్టి చక్రము పద్మము గద శంఖము ధరించిన ముకుందుడు మమ్ములను పవిత్రులను చేయుగాక ! 1

భూమి పాదములుగాను, ఆకాశము నాభిగాను, వాయువు ప్రాణముగాను, సూర్యచంద్రులు నేత్రములుగాను, దిక్కులు కర్ణములుగాను, స్వర్గము శిరస్సుగాను, అగ్ని నోరుగాను, సముద్రము పొత్తికడుపుగాను, ఏ దేవునకు



అంతస్థం యస్య విశ్వం సుర నరఖగగో భోగి గంధర్వ దైత్యైః
చిత్రం రంరమ్యతే తం త్రిభువనవపుషం విష్ణుమీశం నమామి.

(ఓం నమో భగవతే వాసుదేవాయ)

శాన్తాకారం భుజగశయనం పద్మనాభం సురేశం
విశ్వాధారం గగన సదృశం మేఘవర్ణం శుభాంగం
లక్ష్మీకాంతం కమలనయనం యోగి హృద్ధ్యాన గమ్యం
వందే విష్ణుం భవభయహరం సర్వలోకైకనాథమ్. 3

కలవో, దేవమానవ, పశుపక్షి, నాగగంధర్వ రాక్షసులతో కూడిన జగత్తు ఏ దేవుని కుక్షిలో చిత్రముగా భాసించుచున్నదో, అట్టి మూడు లోకములు శరీరముగాగల ఈశ్వరుడైన విష్ణుదేవుని నమస్కరించుచున్నాను. 2

శాంతస్వరూపమైనవానిని, పాముమీద శయనించిన వానిని, బొడ్డున తామరపువ్వు గలవానిని, దేవతలకు ప్రభువైన వానిని, విశ్వమునకు ఆధారమైన వానిని, ఆకాశముతో సమానమైనవానిని, మేఘమువంటి శరీర కాంతి గలవానిని, పుణ్యప్రదమైన శరీరము గలవానిని, లక్ష్మీదేవికి భర్త అయినవానిని, పద్మములవంటి కన్నులు గలవానిని, యోగుల హృదయములో ధ్యానరూపము గలవానిని, సంసారభయమును హరించువానిని, సర్వలోకములకు నాయకుడైనవానిని, విష్ణుదేవునిగూర్చి నమస్కరించుచున్నాను. 3

మేఘశ్యామం పీతకౌశేయవాసం
శ్రీవత్సాంకం కౌస్తుభోద్భాసితాంగం
పుణ్యోపేతం పుండరీకాయతాక్షం
విష్ణుం వందే సర్వలోకైకనాథమ్. 4

(నమః సమస్త భూతానాం ఆది భూతాయ భూభృతే అనేక రూప రూపాయ విష్ణవే ప్రభవిష్ణవే)

సశంఖచక్రం సకిరీట కుండలం
సపీతవస్త్రం సరసీరుహేక్షణం
సహార వక్షస్థల శోభి కౌస్తుభం
నమామి విష్ణుం శిరసా చతుర్భుజమ్. 5

(ఓం భగవంతుడైన వాసుదేవునకు నమస్కారము)

మేఘవర్ణముతో కూడిన శరీరము కలవానిని, పసుపు పచ్చని పట్టువస్త్రము ధరించినవానిని, శ్రీవత్సమను పుట్టుమచ్చ గలవానిని, కౌస్తుభమణితో ప్రకాశించు శరీరము కలవానిని, కమలములవలె విశాలనేత్రములు గలవానిని, సర్వలోకములకు ఈశ్వరుడైనవానిని, పుణ్యముతో కూడినవానిని, విష్ణుదేవుని గూర్చి నమస్కరించుచున్నాను. 4

(సకల భూతములకు మొదలయినవానిని, భూభారమును వహించువానిని, అనేకరూపములతో ప్రకాశించువానిని, విష్ణుదేవుని గూర్చి నమస్కారము.)

శంఖచక్రములును, కిరీటకుండలములును, పచ్చని వస్త్రమును, కమలములబోలు కన్నులును, వక్షస్థలమందు కౌస్తుభమును, నాలుగు భుజములును గల విష్ణుదేవుని గూర్చి సాష్టాంగనమస్కారము చేయుచున్నాను. 5



ఛాయాయాం పారిజాతస్య హేమ సింహాసనోపరి
ఆసీనమంబుద శ్యామ మాయతాక్ష మలంకృతమ్. 6

చంద్రాననం చతుర్బాహుం శ్రీవత్సాంకిత వక్షసం
రుక్మిణీ సత్యభామాభ్యాం సహితం కృష్ణమాశ్రయే. 7

పారిజాతవృక్షము యొక్క నీడలో బంగారుసింహాసనమందు కూర్చున్నవాడును, మేఘవర్ణము గలవాడును, విశాలనేత్రములు గలవాడును, అలంకరింపబడినవాడును. 6

చంద్రునివంటి కాంతిగల ముఖము గలవాడును నాలుగుచేతులు గలవాడును, వక్షస్థలమందు శ్రీవత్సమను పుట్టుమచ్చ గలవాడును, రుక్మిణీ సత్యభామలతో కూడినవాడును అగు కృష్ణభగవానుని ఆశ్రయించెదను. 7

---

ధ్యానము ముగిసిన తర్వాత పంచపూజలు చేయుట శ్రేష్ఠము.

## పంచ పూజలు

లం = పృథివ్యాత్మనే గంధం సమర్పయామి
హం = ఆకాశాత్మనే పుష్పైః పూజయామి
యం = వాయవ్యాత్మనే ధూపమాఘ్రాపయామి
రం = అగ్ని తత్త్వాత్మనే దీపం దర్శయామి
వం = అమృత తత్త్వాత్మనే నైవేద్యం నివేదయామి
సం = సర్వతత్త్వాత్మనే సర్వోపచార పూజా నమస్కారాన్
సమర్పయామి

---

# స్తోత్రము

హరిః ఓమ్

విశ్వం విష్ణు ర్వషట్కారో భూతభవ్య భవత్ ప్రభుః
భూతకృద్ భూతభృద్ భావో భూతాత్మా భూతభావనః. 1

పూతాత్మా పరమాత్మాచ ముక్తానాం పరమాగతిః
అవ్యయః పురుషః సాక్షీ క్షేత్రజ్ఞో ఽక్షర ఏవచ. 2

యోగో యోగవిదాం నేతా ప్రధాన పురుషేశ్వరః
నారసింహవపుః శ్రీమాన్ కేశవః పురుషోత్తమః. 3

సర్వః శర్వః శివస్థాణుః భూతాదిర్నిధి రవ్యయః
సంభవో భావనో భర్తా ప్రభవః ప్రభురీశ్వరః. 4

స్వయంభూః శంభురాదిత్యః పుష్కరాక్షో మహాస్వనః
అనాది నిధనోధాతా విధాతా ధాతు రుత్తమః. 5

అప్రమేయో హృషీకేశః పద్మనాభో ఽమరప్రభుః
విశ్వకర్మామను స్త్వష్టా స్థవిష్ఠః స్థవిరో ధ్రువః. 6

అగ్రాహ్య శ్శాశ్వతః కృష్ణో లోహితాక్షః ప్రతర్దనః
ప్రభూతః త్రికకుద్ధామ పవిత్రం మంగళం పరమ్. 7

ఈశానః ప్రాణదః ప్రాణో జ్యేష్ఠః శ్రేష్ఠః ప్రజాపతిః
హిరణ్యగర్భో భూగర్భో మాధవో మధుసూదనః. 8

ఈశ్వరో విక్రమీధన్వీ మేధావీ విక్రమః క్రమః
అనుత్తమో దురాధర్షః కృతజ్ఞః కృతిరాత్మవాన్. 9



సురేశః శరణం శర్మ విశ్వరేతాః ప్రజాభవః
అహస్సంవత్సరో వ్యాళః ప్రత్యయః సర్వదర్శనః. 10

అజ స్సర్వేశ్వరస్సిద్ధః సిద్ధి స్సర్వాది రచ్యుతః
వృషాకపిరమేయాత్మా సర్వయోగ వినిస్సృతః. 11

వసుర్వసుమనాస్సత్యః సమాత్మా సమ్మితస్సమః
అమోఘః పుండరీకాక్షో వృషకర్మా వృషాకృతిః. 12

రుద్రో బహుశిరా బభ్రుః విశ్వయోనిః శుచిశ్రవాః
అమృతః శాశ్వత స్థాణుః వరారోహో మహాతపాః. 13

సర్వగః సర్వవిద్భానుః విష్వక్సేనో జనార్దనః
వేదోవేదవిదవ్యంగో వేదాంగో వేదవిత్కవిః. 14

లోకాధ్యక్షః సురాధ్యక్షో ధర్మాధ్యక్షః కృతాకృతః
చతురాత్మా చతుర్వ్యూహః చతుర్దంష్ట్రః చతుర్భుజః. 15

భ్రాజిష్ణుః భోజనం భోక్తా సహిష్ణుః జగదాదిజః
అనఘో విజయో జేతా విశ్వయోనిః పునర్వసుః. 16

ఉపేంద్రో వామనః ప్రాంశుః అమోఘః శుచిరూర్జితః
అతీంద్రః సంగ్రహస్సర్గో ధృతాత్మానియమో యమః. 17

వేద్యోవైద్యః సదాయోగీ వీరహా మాధవో మధుః
అతీంద్రియో మహామాయో మహోత్సాహో మహాబలః. 18

మహాబుద్ధిః మహావీర్యో మహాశక్తిః మహాద్యుతిః
అనిర్దేశ్యవపుః శ్రీమాన్ అమేయాత్మా మహాద్రి ధృక్. 19

మహేష్వాసో మహీభర్తా శ్రీనివాసః సతాంగతిః
అనిరుద్ధః సురానందో గోవిందో గోవిదాం పతిః. 20

మరీచిః దమనో హంసః సుపర్ణో భుజగోత్తమః
హిరణ్యనాభః సుతపాః పద్మనాభః ప్రజాపతిః. 21

అమృత్యుః సర్వదృక్సింహః సంధాతా సంధిమాన్ స్థిరః
అజో దుర్మర్షణః శాస్తా విశ్రుతాత్మా సురారిహా. 22

గురుర్గురుతమో ధామ సత్యస్సత్య పరాక్రమః
నిమిషో ఽనిమిషః స్రగ్వీ వాచస్పతి రుదారధీః. 23

అగ్రణీః గ్రామణీః శ్రీమాన్ న్యాయోనేతా సమీరణః
సహస్రమూర్ధా విశ్వాత్మా సహస్రాక్షః సహస్రపాత్. 24

ఆవర్తనో నివృత్తాత్మా సంవృతః సంప్రమర్దనః
అహస్సంవర్తకో వహ్నిః అనిలో ధరణీధరః. 25

సుప్రసాదః ప్రసన్నాత్మా విశ్వదృగ్విశ్వ భుగ్విభుః
సత్కర్తా సత్కృతస్సాధుః జహ్నుర్నారాయణోనరః. 26

అసంఖ్యేయో ఽప్రమేయాత్మా విశిష్టః శిష్టకృచ్ఛుచిః
సిద్ధార్థః సిద్ధ సంకల్పః సిద్ధిదస్సిద్ధి సాధనః. 27

వృషాహీ వృషభో విష్ణుః వృషపర్వా వృషోదరః
వర్ధనో వర్ధమానశ్చ వివిక్తః శ్రుతిసాగరః. 28

సుభుజో దుర్ధరో వాగ్మీ మహేంద్రో వసుదో వసుః
నైకరూపో బృహద్రూపః శిపివిష్టః ప్రకాశనః. 29



ఓజస్తేజో ద్యుతిధరః ప్రకాశాత్మా ప్రతాపనః
ఋద్ధః స్పష్టాక్షరో మంత్రః చంద్రాంశు ర్భాస్కర ద్యుతిః. 30

అమృతాంశూద్భవో భానుః శశబిందు స్సురేశ్వరః
ఔషధం జగతః సేతుః సత్యధర్మ పరాక్రమః. 31

భూతభవ్య భవన్నాథః పవనః పావనో ఽనలః
కామహా కామకృత్కాంతః కామః కామప్రదః ప్రభుః. 32

యుగాది కృద్యుగావర్తో నైకమాయో మహాశనః
అదృశ్యో వ్యక్తరూపశ్చ సహస్రజిదనంతజిత్. 33

ఇష్టోఽవిశిష్టః శిష్టేష్టః శిఖండీ నహుషో వృషః
క్రోధహా క్రోధకృత్కర్తా విశ్వబాహుః మహీధరః. 34

అచ్యుతః ప్రథితః ప్రాణః ప్రాణదో వాసవానుజః
అపాం నిధి రధిష్ఠాన మప్రమత్తః ప్రతిష్ఠితః. 35

స్కందః స్కందధరో ధుర్యో వరదో వాయు వాహనః
వాసుదేవో బృహద్భానుః ఆదిదేవః పురందరః. 36

అశోకస్తారణ స్తారః శూరః శౌరిర్జనేశ్వరః
అనుకూలః శతావర్తః పద్మీపద్మనిభేక్షణః. 37

పద్మనాభో ఽరవిందాక్షః పద్మగర్భః శరీరభృత్
మహర్ధిః ఋద్ధో వృద్ధాత్మా మహాక్షో గరుడధ్వజః. 38

అతులః శరభో భీమః సమయజ్ఞో హవిర్హరిః
సర్వలక్షణ లక్షణ్యో లక్ష్మీవాన్ సమితింజయః 39

విక్షరో రోహితో మార్గో హేతు ర్దామోదర స్సహః
మహీధరో మహాభాగో వేగవానమితాశనః. 40

ఉద్భవః క్షోభణో దేవః శ్రీగర్భః పరమేశ్వరః
కరణం కారణం కర్తా వికర్తా గహనో గుహః. 41

వ్యవసాయో వ్యవస్థానః సంస్థానః స్థానదో ధ్రువః
పరర్ధిః పరమస్పష్టః తుష్టః పుష్టః శుభేక్షణః. 42

రామో విరామో విర(తో)జో మార్గోనేయో నయో ఽనయః
వీరః శక్తిమతాం శ్రేష్ఠో ధర్మోధర్మవిదుత్తమః. 43

వైకుంఠః పురుషః ప్రాణః ప్రాణదః ప్రణవః పృథుః
హిరణ్యగర్భః శత్రుఘ్నో వ్యాప్తో వాయురధోక్షజః. 44

ఋతుః సుదర్శనః కాలః పరమేష్ఠీ పరిగ్రహః
ఉగ్రః సంవత్సరో దక్షో విశ్రామో విశ్వదక్షిణః. 45

విస్తారః స్థావరః స్థాణుః ప్రమాణం బీజమవ్యయం
అర్థో ఽనర్థో మహాకోశో మహాభోగో మహాధనః. 46

అనిర్విణ్ణః స్థవిష్ఠో భూర్ధర్మయూపో మహామఖః
నక్షత్రనేమి ర్నక్షత్రీ క్షమః క్షామ స్సమీహనః. 47

యజ్ఞ ఇజ్యో మహేజ్యశ్చ క్రతుస్సత్రం సతాంగతిః
సర్వదర్శీ విముక్తాత్మా సర్వజ్ఞో జ్ఞానముత్తమమ్. 48

సువ్రతః సుముఖః సూక్ష్మః సుఘోషః సుఖదః సుహృత్
మనోహరో జితక్రోధో వీరబాహు ర్విదారణః. 49



స్వాపనః స్వవశో వ్యాపీ నైకాత్మా నైకకర్మకృత్
వత్సరో వత్సలో వత్సీ రత్నగర్భో ధనేశ్వరః. 50

ధర్మగుబ్ధర్మకృద్ధర్మీ సదసత్ క్షరమక్షరం
అవిజ్ఞాతా సహస్రాంశుః విధాతా కృతలక్షణః. 51

గభస్తినేమిః సత్త్వస్థః సింహో భూతమహేశ్వరః
ఆదిదేవో మహాదేవో దేవేశో దేవభృద్గురుః. 52

ఉత్తరో గోపతిర్గోప్తా జ్ఞానగమ్యః పురాతనః
శరీరభూతభృత్ భోక్తా కపీంద్రో భూరిదక్షిణః. 53

సోమపో ఽమృతపస్సోమః పురుజిత్ పురుసత్తమః
వినయో జయః సత్యసంధో దాశార్హః సాత్వతాం పతిః. 54

జీవో వినయితాసాక్షీ ముకుందో ఽమిత విక్రమః
అంభోనిధిరనంతాత్మా మహోదధిశయో ఽన్తకః. 55

అజో మహార్హః స్వాభావ్యో జితామిత్రః ప్రమోదనః
ఆనందో నందనోనంతః సత్యధర్మా త్రివిక్రమః. 56

మహర్షిః కపిలాచార్యః కృతజ్ఞో మేదినీపతిః
త్రిపదః త్రిదశాధ్యక్షో మహాశృంగః కృతాన్తకృత్. 57

మహావరాహో గోవిందః సుషేణః కనకాంగదీ
గుహ్యో గభీరో గహనో గుప్త శ్చక్రగదాధరః. 58

వేధాః స్వాంగో ఽజితః కృష్ణో దృఢః సంకర్షణో ఽచ్యుతః
వరుణో వారుణో వృక్షః పుష్కరాక్షో మహామనాః. 59

భగవాన్ భగహాఽఽనందీ వనమాలీ హలాయుధః |

ఆదిత్యో జ్యోతిరాదిత్యః సహిష్ణుర్గతిసత్తమః || 60 ||

సుధన్వా ఖండపరశు ర్దారుణో ద్రవిణప్రదః |

దివఃస్పృక్ సర్వదృగ్ వ్యాసో వాచస్పతిరయోనిజః || 61 ||

త్రిసామా సామగః సామ నిర్వాణం భేషజం భిషక్ |

సన్న్యాసకృచ్ఛమః శాంతో నిష్ఠా శాంతిః పరాయణమ్ || 62 ||

శుభాంగః శాంతిదః స్రష్టా కుముదః కువలేశయః |

గోహితో గోపతిర్గోప్తా వృషభాక్షో వృషప్రియః || 63 ||

అనివర్తీ నివృత్తాత్మా సంక్షేప్తా క్షేమకృచ్ఛివః |

శ్రీవత్సవక్షాః శ్రీవాసః శ్రీపతిః శ్రీమతాంవరః || 64 ||

శ్రీదః శ్రీశః శ్రీనివాసః శ్రీనిధిః శ్రీవిభావనః |

శ్రీధరః శ్రీకరః శ్రేయః శ్రీమాన్ లోకత్రయాశ్రయః || 65 ||

స్వక్షః స్వంగః శతానందో నంది ర్జ్యోతిర్గణేశ్వరః |

విజితాత్మాఽవిధేయాత్మా సత్కీర్తిశ్ఛిన్నసంశయః || 66 ||

ఉదీర్ణః సర్వతశ్చక్షు రనీశః శాశ్వతస్థిరః |

భూశయో భూషణో భూతి ర్విశోకః శోకనాశనః || 67 ||

అర్చిష్మా నర్చితః కుంభో విశుద్ధాత్మా విశోధనః |

అనిరుద్ధోఽప్రతిరథః ప్రద్యుమ్నోఽమితవిక్రమః || 68 ||

కాలనేమినిహా వీరః శౌరిః శూరజనేశ్వరః |

త్రిలోకాత్మా త్రిలోకేశః కేశవః కేశిహా హరిః || 69 ||

కామదేవః కామపాలః కామీ కాంతః కృతాగమః |

అనిర్దేశ్యవపు ర్విష్ణు ర్వీరోఽనంతో ధనంజయః || 70 ||

బ్రహ్మణ్యో బ్రహ్మకృద్ బ్రహ్మా బ్రహ్మ బ్రహ్మవివర్ధనః |

బ్రహ్మవిద్ బ్రాహ్మణో బ్రహ్మీ బ్రహ్మజ్ఞో బ్రాహ్మణప్రియః || 71 ||

మహాక్రమో మహాకర్మా మహాతేజా మహోరగః |

మహాక్రతు ర్మహాయజ్వా మహాయజ్ఞో మహాహవిః || 72 ||

స్తవ్యః స్తవప్రియః స్తోత్రం స్తుతిః స్తోత్రాం రణప్రియః |

పూర్ణః పూరయితా పుణ్యః పుణ్యకీర్తి రనామయః || 73 ||

మనోజవః తీర్థకరో వసురేతా వసుప్రదః |

వసుప్రదో వాసుదేవో వసుర్వసుమనా హవిః || 74 ||

సద్గతిః సత్కృతిః సత్తా సద్భూతిః సత్పరాయణః |

శూరసేనో యదుశ్రేష్ఠః సన్నివాసః సుయామునః || 75 ||

భూతావాసో వాసుదేవః సర్వాసునిలయోఽనలః |

దర్పహా దర్పదో దృప్తో దుర్ధరోఽథాపరాజితః || 76 ||

విశ్వమూర్తి ర్మహామూర్తిః దీప్తమూర్తి రమూర్తిమాన్ |

అనేకమూర్తి రవ్యక్తః శతమూర్తిః శ్శతాననః || 77 ||

ఏకో నైకః స్తవః కః కిం యత్తత్ పదమనుత్తమమ్ |

లోకబంధు ర్లోకనాథో మాధవో భక్తవత్సలః || 78 ||

సువర్ణవర్ణో హేమాంగో వరాంగశ్చందనాంగదీ |

వీరహా విషమః శూన్యో ఘృతాశీ రచల శ్చలః || 79 ||

అమానీ మానదో మాన్యో లోకస్వామీ త్రిలోక ధృత్(క్)
సుమేధా మేధజో ధన్యః సత్యమేధా ధరాధరః. 80

తేజోవృషో ద్యుతిధరః సర్వశస్త్ర భృతాంవరః
ప్రగ్రహో నిగ్రహో వ్యగ్రో నైకశృంగో గదాగ్రజః. 81

చతుర్మూర్తిః చతుర్బాహుః చతుర్వ్యూహ శ్చతుర్గతిః
చతురాత్మా చతుర్భావః చతుర్వేదవిదేకపాత్. 82

సమావర్తో ఽనివృత్తాత్మా దుర్జయో దురతిక్రమః
దుర్లభో దుర్గమో దుర్గో దురావాసో దురారిహా. 83

శుభాంగో లోకసారంగః సుతంతుః తంతువర్ధనః
ఇంద్రకర్మా మహాకర్మా కృతకర్మా కృతాగమః. 84

ఉద్భవః సుందరః సుందో రత్ననాభః సులోచనః
అర్కో వాజసనః శృంగీ జయంతః సర్వవిజ్జయీ. 85

సువర్ణబిందు రక్షోభ్యః సర్వవాగీశ్వరేశ్వరః
మహాహ్రదో మహాగర్తో మహాభూతో మహానిధిః 86

కుముదః కుందరః కుందః పర్జన్యః పావనో ఽనిలః
అమృతాశో ఽమృతవపుః సర్వజ్ఞః సర్వతోముఖః. 87

సులభః సువ్రతః సిద్ధః శత్రుజిత్ శత్రుతాపనః
న్యగ్రోధో దుంబరో ఽశ్వత్థః చాణూరాంధ్ర నిషూదనః. 88

సహస్రార్చిః సప్తజిహ్వః సప్తైధాః సప్తవాహనః
అమూర్తి రనఘో ఽచింత్యో భయకృద్భయ నాశనః. 89



అణుర్బృహత్ కృశః స్థూలో గుణభృన్నిర్గుణో మహాన్
అధృతః స్వధృతః స్వాస్థ్యః ప్రాగ్వంశో వంశవర్ధనః. 90

భారభృత్కథితో యోగీ యోగీశః సర్వకామదః
ఆశ్రమః శ్రమణః క్షామః సుపర్ణో వాయువాహనః. 91

ధనుర్ధరో ధనుర్వేదో దండోదమయితా దమః
అపరాజితః సర్వసహో నియంతా ఽనియమో ఽయమః. 92

సత్త్వవాన్ సాత్త్వికః సత్త్వః సత్యధర్మ పరాయణః
అభిప్రాయః ప్రియార్హో ఽర్హః ప్రియకృత్ప్రీతి వర్ధనః. 93

విహాయసగతిర్జ్యోతిః సురుచిః హుతభుగ్విభుః
రవిర్విరోచనః సూర్యః సవితా రవిలోచనః. 94

అనంతో హుతభుక్ భోక్తా సుఖదో నైకదో ఽగ్రజః
అనిర్విణ్ణః సదామర్షీ లోకాధిష్ఠాన మద్భుతః. 95

సనాత్ సనాతన తమః కపిలః కపిరవ్యయః
స్వస్తిదః స్వస్తికృత్ స్వస్తి స్వస్తిభుక్ స్వస్తి దక్షిణః. 96

అరౌద్రః కుండలీ చక్రీ విక్రమ్యూర్జిత శాసనః
శబ్దాతిగః శబ్దసహః శిశిరః శర్వరీకరః. 97

అక్రూరః పేశలో దక్షో దక్షిణః క్షమిణాం వరః
విద్వత్తమో వీతభయః పుణ్యశ్రవణ కీర్తనః. 98

ఉత్తారణో దుష్కృతిహా పుణ్యో దుస్స్వప్ననాశనః
వీరహా రక్షణః సంతో జీవనః పర్యవస్థితః. 99

అనంతరూపో ఽనంత శ్రీః జితమన్యుః భయాపహః
చతురశ్రో గభీరాత్మా విదిశో వ్యాదిశో దిశః. 100

అనాదిః భూర్భువో లక్ష్మీః సువీరో రుచిరాంగదః
జననో జనజన్మాదిః భీమోభీమ పరాక్రమః. 101

ఆధారనిలయో ఽధాతా పుష్పహాసః ప్రజాగరః
ఊర్ధ్వగః సత్పథాచారః ప్రాణదః ప్రణవః పణః. 102

ప్రమాణం ప్రాణనిలయః ప్రాణభృత్ప్రాణ జీవనః
తత్త్వం తత్వవిదేకాత్మా జన్మమృత్యు జరాతిగః. 103

భూర్భువః స్వస్తరుస్తారః సవితా ప్రపితామహః
యజ్ఞో యజ్ఞపతిర్యజ్వా యజ్ఞాంగో యజ్ఞవాహనః. 104

యజ్ఞభృత్ యజ్ఞకృత్ యజ్ఞీయజ్ఞభుక్ యజ్ఞసాధనః
యజ్ఞాన్తకృత్ యజ్ఞగుహ్య మన్నమన్నాద ఏవచ. 105

ఆత్మయోనిః స్వయంజాతో వైఖాన స్సామగాయనః
దేవకీనందనః స్రష్టా క్షితీశః పాపనాశనః. 106

శంఖభృన్నందకీ చక్రీ శార్ఙ్గధన్వా గదాధరః
రథాంగపాణి రక్షోభ్యః సర్వప్రహరణాయుధః. 107

(శ్రీ సర్వప్రహరణాయుధ ఓం నమ ఇతి)

వనమాలీ గదీ శార్ఙ్గీ శంఖీ చక్రీ చ నందకీ
శ్రీమాన్నారాయణో విష్ణుః వాసుదేవో ఽభిరక్షతు. 108



## ఉత్తరన్యాసః

అంగన్యాసము చేయవలెను.

ఋషిః సుదర్శనః కాల ఇతి దిగ్విమోకః

## ధ్యానమ్

క్షీరోదన్వ ప్రదేశే మొదలు చంద్రాననం చతు ర్బాహుం అనే శ్లోకమువరకు చదివి తరువాత పంచపూజలు చేయవలెను—

---

## ఉత్తరభాగము

(ఫలశ్రుతి)

ఇతీదం కీర్తనీయస్య కేశవస్య మహాత్మనః
నామ్నాం సహస్రం దివ్యానాం అశేషేణ ప్రకీర్తితమ్. 1

య ఇదం శృణుయాన్నిత్యం యశ్చాపి పరికీర్తయేత్
నాశుభం ప్రాప్నుయాత్ కించిత్ సో ఽముత్రేహ చ మానవః. 2

మహాత్ముడును, కీర్తింపతగినవాడును అయిన కేశవుడనే విష్ణుదేవునియొక్క వేయిదివ్యనామములు పూర్తిగా చెప్పబడినవి.

ఈ సహస్రనామములు ప్రతినిత్యము విన్నవారును, పారాయణ చేసినవారును, సకల శుభములను పొందెదరు. 2

వేదాంతగో బ్రాహ్మణః స్యాత్, క్షత్రియో విజయీ భవేత్
వైశ్యో ధనసమృద్ధః స్యాత్, శూద్రః సుఖమవాప్నుయాత్. 3
ధర్మార్థీ ప్రాప్నుయాద్ధర్మ మర్థార్థీచార్థ మాప్నుయాత్
కామానవాప్నుయాత్కామీ ప్రజార్థీ చాప్నుయాత్ ప్రజామ్. 4
భక్తిమాన్యః సదోత్థాయ శుచిః సద్గతమానసః
సహస్రం వాసుదేవస్య నామ్నామేతత్ ప్రకీర్తయేత్. 5
యశః ప్రాప్నోతి విపులం యాతి ప్రాధాన్యమేవచ
అచలాంశ్రియ మాప్నోతి శ్రేయః ప్రాప్నోత్యనుత్తమమ్. 6

బ్రాహ్మణుడు వేదాంతజ్ఞానమును, క్షత్రియుడు విజయమును, వైశ్యుడు ధనసమృద్ధిని, శూద్రుడు సకలసుఖములను పొందెదరు. 3

ధర్మమును కోరువాడు ధర్మమును, ధనమును కోరువాడు ధనమును, భోగములు కోరువాడు భోగములను, సంతానము గోరువాడు సంతానమును పొందును. 4

ఎవడు నిద్రలేవగానే ప్రతిరోజు పరిశుద్ధభక్తికలవాడై వాసుదేవునియొక్క యీ వెయ్యి నామములను చక్కగా కీర్తించుచున్నాడో, 5

వాడు కీర్తిని, గొప్ప స్థానమును. తరుగని భాగ్యములను శ్రేయస్సును పొందుచున్నాడు. 6



నభయం క్వచిదాప్నోతి వీర్యం తేజశ్చ విందతి
భవత్యరోగో ద్యుతిమాన్ బలరూప గుణాన్వితః. 7
రోగార్తో ముచ్యతే రోగాత్ బద్ధోముచ్యేత బంధనాత్
భయాన్ముచ్యేత భీతస్తు ముచ్యేతాపన్న ఆపదః. 8
దుర్గాణ్యతితరత్యాశు పురుషః పురుషోత్తమం
స్తువన్నామ సహస్రేణ నిత్యం భక్తి సమన్వితః. 9
వాసుదేవాశ్రయో మర్త్యో వాసుదేవ పరాయణః
సర్వపాప విశుద్ధాత్మాయాతి బ్రహ్మ సనాతనమ్. 10

వాడు కొంచెమైనను భయమును పొందడు. ఉత్సాహమును వీర్యమును పొందును. రోగము లేనివాడును, కాంతివంతుడును, బలము రూపము మొదలైన మంచి గుణములతో గూడినవాడగును. 7

రోగమువల్ల పీడింపబడువాడు ఆరోగ్యవంతుడగును, బంధింపబడినవాడు బంధనములనుండి విముక్తుడగును. భీతిగలవాడు నిర్భయుడగును. ఆపదలుగలవాడాపదలనుండి బయటపడును. 8

ప్రతినిత్యము భక్తికలవాడై సహస్రనామములచేత పురుషోత్తముడైన విష్ణువును స్తుతించిన పురుషుడు ఎట్టి కష్టములనైనను త్వరలో వదలించుకొనును. 9

వాసుదేవుడైన విష్ణుదేవు నాశ్రయించి వాసుదేవుని యందే భక్తిగల మనుజుడు సకలపాపములనుండి విముక్తుడై పరిశుద్ధాత్మగలవాడై సనాతనమైన బ్రహ్మమును పొందును.

న వాసుదేవ భక్తానా మశుభం విద్యతే క్వచిత్
జన్మమృత్యు జరావ్యాధి భయం నైవోప జాయతే. 11

ఇమం స్తవ మధీయానః శ్రద్ధాభక్తి సమన్వితః
యుజ్యేతాత్మ సుఖక్షాంతి శ్రీధృతి స్మృతి కీర్తిభిః. 12

నక్రోధో నచ మాత్సర్యం నలోభోనాశుభామతిః
భవంతి కృతపుణ్యానాం భక్తానాం పురుషోత్తమే. 13

ద్యౌః సచంద్రార్క నక్షత్రా ఖం దిశో భూర్మహోదధిః
వాసుదేవస్య వీర్యేణ విధృతాని మహాత్మనః. 14

వాసుదేవుని భక్తుల కేవిధమైన అశుభములు కలుగవు. పుట్టుట, చచ్చుట, ముసలితనము, రోగము మొదలైన భయము లుండవు. 11

భక్తిశ్రద్ధలతో యీ సహస్రనామమును పారాయణ చేయువాడు, ఆత్మసుఖము, శాంతి, భాగ్యము, ధైర్యము, జ్ఞాపకశక్తి,యశము మొదలైనవానితో కూడినవాడగును. 12

పురుషోత్తముడైన విష్ణుభక్తులకు, కోపము, అసూయ, లోభము, చెడుగుణములు తొలగిపోవుచున్నవి. 13

దేవలోకము, చంద్ర సూర్య నక్షత్రములతో కూడిన ఆకాశము, దిక్కులు, భూమి, సముద్రము, మహాత్ముడైన వాసుదేవునియొక్క ప్రభావముచేత నిలుచుచున్నవి. 14



ససురాసుర గంధర్వం సయక్షోరగ రాక్షసం
జగద్వశే వర్తతేదం కృష్ణస్య స చరాచరమ్. 15

ఇంద్రియాణి మనోబుద్ధిః సత్త్వం తేజోబలం ధృతిః
వాసుదేవాత్మకాన్యాహుః క్షేత్రం క్షేత్రజ్ఞ ఏవచ. 16

సర్వాగమానా మాచారః ప్రథమం పరికల్ప్యతే
ఆచార ప్రభవో ధర్మోధర్మస్య ప్రభురచ్యుతః. 17

ఋషయః పితరో దేవాః మహాభూతాని ధాతవః
జంగమాజంగమంచేదం జగన్నారాయణోద్భవమ్. 18

దేవతలు, దానవులు, గంధర్వులు, యక్షులు, పన్నగములు, రక్కసులు, చరాచరరూపమైన జగత్తు, శ్రీకృష్ణుని స్వాధీనమందున్నది. 15

జ్ఞాన కర్మేంద్రియములు, మనస్సు బుద్ధి, చిత్తము, కాంతి బలము, ధైర్యము, శరీరము, జీవుడు, ఇవన్నియు వాసుదేవుని రూపములని చెప్పబడుచున్నవి. 16

సకల వేదములకు మొదట ఆచారము చెప్పబడినది ఆచారమునుండి ధర్మము పుట్టుచున్నది. ధర్మమునకు అచ్యుతుడే ప్రభువు. 17

ఋషులు, పితృదేవతలు, దేవతలు, పంచమహాభూతములు, సప్తధాతువులు, చరాచరాత్మకమైన జగము, ఇవన్నియు శ్రీమన్నారాయణునివలన పుట్టినవి. 18

యోగోజ్ఞానం తథా సాంఖ్యం విద్యాః శిల్పాది కర్మచ
వేదాః శాస్త్రాణి విజ్ఞానం ఏతత్ సర్వం జనార్దనాత్. 19

ఏకో విష్ణుః మహత్భూతం పృథగ్భూతా న్యనేకశః
త్రీన్‌లోకాన్ వ్యాప్య భూతాత్మా భుంక్తే విశ్వభుగవ్యయః. 20

ఇమం స్తవం భగవతో విష్ణోః వ్యాసేన కీర్తితం
పఠేద్య ఇచ్ఛేత్ పురుషః శ్రేయః ప్రాప్తుం సుఖానిచ. 21

విశ్వేశ్వర మజందేవం జగతః ప్రభుమవ్యయం
భజన్తి యే పుష్కరాక్షం నతేయాన్తి పరాభవమ్. 22

యోగము, జ్ఞానము, సాంఖ్యము, సకలవిద్యలు, శిల్పము మొదలగు కర్మలు, వేదములు, శాస్త్రములు, విజ్ఞానము ఈ సకలము జనార్దనునివలన కలుగుచున్నవి. 19

విష్ణు వొక్కడే మహాభూతము. తక్కినవెల్ల అనేక భూతములు భూతాత్ముడైన విష్ణువే ముల్లోకములందు వ్యాపించి అనుభవించుచున్నాడు. 20

ఏ మానవుడు శ్రేయస్సు, సుఖము కావలెనని కోరుచున్నాడో ఆ మానవుడు వ్యాసమహర్షి చేత కీర్తింపబడిన శ్రీ విష్ణుసహస్రనామమును పఠించవలెను. 21

జగదీశ్వరుడును, జన్మలేనివాడును, లోకనాయకుడును, అవ్యయుడును అయినటువంటి పద్మనేత్రుడైన విష్ణుదేవుని ఎవడు భజించునో వాడు పరాభవములను పొందడు.



న తేయాంతి పరాభవం ఓం నమ ఇతి.

అర్జున ఉవాచ :—

పద్మపత్ర విశాలాక్ష పద్మనాభ సురోత్తమ
భక్తానా మనురక్తానాం త్రాతాభవ జనార్దన. 23

శ్రీభగవాన్ ఉవాచ :—

యోమాం నామసహస్రేణ స్తోతు మిచ్ఛతి పాండవ
సోఽహమేకేన శ్లోకేన స్తుత ఏవ న సంశయః. 24

(స్తుత ఏవన సంశయః ఓం నమ ఇతి)

ఓం, నమః, అని సకల శుభములకొరకు విష్ణుదేవునికి నమస్కరించుచున్నాను.

అర్జునుడు చెప్పెను :—

పద్మములవలె విశాలమైన కన్నులుగలవాడా! బొడ్డున తామరపువ్వు గలవాడా! దేవతలందరికంటె శ్రేష్ఠమైన వాడా! జనార్దనా! దయతో భక్తులను కాపాడవలెను. 23

భగవంతుడు చెప్పెను :—

పాండవా! ఎవడు నన్ను సహస్రనామముచేత స్తుతించుటకు కోరినను, నేను ఒక శ్లోకముచేతనే వాని స్తోత్రమును స్వీకరించెదను. ఇందులో సందేహము లేదు. 24

వ్యాస ఉవాచ :—

వాసనా ద్వాసుదేవస్య వాసితంతే జగత్రయం
సర్వభూత నివాసోఽసి వాసుదేవ నమోస్తుతే. 25

(శ్రీవాసుదేవ నమోస్తుత ఓం నమ ఇతి)

పార్వత్యువాచ :—

కేనోపాయేన లఘునా విష్ణోర్నామ సహస్రకం
పఠ్యతే పండితైర్నిత్యం శ్రోతు మిచ్ఛామ్యహం ప్రభో. 26

వ్యాసుడు పలికెను :—

వాసుదేవా! అంతటను నిండిన నీవు వసించుటచేత నే మూడులోకములు నిలిచియున్నవి. సర్వభూతములయందు నివసించిన నీకు నమస్కారము. 25

(ఓం నమస్కారము)

పార్వతి చెప్పెను :—

ప్రభో! జ్ఞానవంతులైన పండితులు నిత్యము ఏ ఉపాయముచేత సులభముగా శ్రీ విష్ణుసహస్రనామమును పారాయణ చేయుచున్నారో ఆ సహస్రనామమును వినగోరుచున్నాను. 26



ఈశ్వర ఉవాచ :—

శ్రీరామ రామ రామేతి రమేరామే మనోరమే
సహస్రనామ తత్తుల్యం రామనామ వరాననే. 27

(శ్రీరామనామ వరానన ఓం నమ ఇతి)

బ్రహ్మోవాచ :—

నమోఽస్త్వనంతాయ సహస్రమూర్తయే
సహస్రపాదాక్షి శిరోరు బాహవే
సహస్రనామ్నే పురుషాయ శాశ్వతే
సహస్రకోటి యుగధారిణే నమః. 28

(సహస్రకోటి యుగధారిణ ఓం నమ ఇతి)

ఈశ్వరుడు చెప్పెను :—

సుందరమైన ముఖముగలదానా! శ్రీరామరామరామ యని మనోహరుడైన రామునియందే నేను రమించుచున్నాను. ఆ రామనామము సహస్రనామమునకు సమానమైనది.

(చారువదనా! రామనామమే సహస్రనామమునకు సమానము.
ఓం నమస్కారము)

బ్రహ్మ చెప్పెను :—

అంతము లేనటువంటినిన్ను, వేయిరూపములతో ప్రకాశించుచున్నటువంటిన్ని, వెయ్యిపాదములు, వెయ్యికన్నులు, వెయ్యితలలు, వెయ్యితొడలు, వెయ్యిభుజములు, వెయ్యినామములు కలిగియున్న నిత్యుడైన పురుషునికొరకు నమస్కారము. సహస్రకోటియుగములను ధరించిన విష్ణువునకు నమస్కారము. 28

(సహస్రకోటి యుగములు ధరించినవానికి నమస్కారము
ఓం నమస్కారము)

సంజయ ఉవాచ :—

యత్ర యోగేశ్వరః కృష్ణో యత్రపార్థో ధనుర్ధరః
తత్రశ్రీ ర్విజయోభూతిః ధ్రువా నీతిర్మతిర్మమ. 29

శ్రీభగవాన్ ఉవాచ :—

అనన్యాశ్చింతయంతోమాం యే జనాః పర్యుపాసతే
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్. 30

పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే. 31

ఎక్కడ యోగేశ్వరుడైన శ్రీకృష్ణపరమాత్మయుం డునో ఎక్కడ ధనుస్సును ధరించిన అర్జునుడు ఉండునో ఆక్కడ మంగళము, విజయము, ఐశ్వర్యము నిశ్చయముగా ఉండునని నా యభిప్రాయము, 29

ఏ జనులు ఇతర చింతనలులేక నన్నే నమ్మి ఉపాసన చేయుచున్నారో అటువంటి యుక్తమైనవారియొక్క యోగ క్షేమములను నేను వహించుచున్నాను. 30

సాధుజనులను రక్షించుటకు, దుష్టజనులను శిక్షించు టకు, ధర్మమును నిలబెట్టుటకు, ప్రతియుగమునందును పుట్టు చున్నాను. 31



ఆర్తా విషణ్ణా శ్శిథిలాశ్చ భీతా
ఘోరేషు చ వ్యాధిషు వర్తమానాః
సంకీర్త్య నారాయణ శబ్దమాత్రం
విముక్త దుఃఖాః సుఖినోభవంతు. 32

కాయేన వాచా మనసేంద్రియైర్వా
బుద్ధ్యాత్మనా వా ప్రకృతేః స్వభావాత్
కరోమి యద్యత్ సకలం పరస్మై
నారాయణా యేతి సమర్పయామి. 33

ఓం తత్ సత్.

దుఃఖములవల్ల శిథిలమైన మనస్సుగలవారును, భయ ముగలవారును, ఘోరమైనవ్యాధులతో పీడింపబడినవారును, "నారాయణ" అను శబ్దమును చెప్పినంతమాత్రముచేత సకలదుఃఖములను బాసి సుఖవంతులగుదురు. 32

శరీరముచేతను, వాక్కుచేతను, మనసుచేతను, జ్ఞానేంద్రియములచేతను, బుద్ధిచేతను, స్వభావముచేతను, ఏ యే కర్మలను చేయుచున్నానో ఆ కర్మలనెల్లను "నారాయణ" అని పరమపురుషుడైన నారాయణునకు సమర్పణ చేయుచున్నాను. 33

ఓం తత్ సత్.